Regd. No. H. NL. 18
సంపుటి: 56
సంచిక: 22

# జమీన్‌రైతు

స్థాపకులు : నెల్లూరు వెంకట్రామానాయుడుగారు
సంపాదకుడు : నెల్లూరు శ్రీరామమూర్తి

31-5-85
శుక్రవారం
12 పేజీలు
75 పైసలు.

# ఈనాడు ఆనాటి రామోజీకాదు!

తెలుగుదేశంపార్టీ వల్లకిని అటిపుట్టిన నాటినుంచి మోస్తూ ఆపార్టీకి విపరీత ప్రచారం చేసిపెట్టిన ఈనాడు పత్రికాధి



పతి శ్రీ సి. హెచ్. రామోజీరావు మరొక ప్రాంతీయపార్టీని ప్రారంభించడానికి తీవ్రప్రయత్నాలు చేస్తున్నారు. ఇందుకోసం ఇటు తెలుగుదేశం పార్టీ

## ఎన్టీఆర్‌కు వ్యతిరేకం?

లోని అసమ్మతివర్గాన్ని, అటు కాంగ్రెస్ (ఐ) లోని అసమ్మతివర్గాన్ని చేరదీసుకొని ఆయన చర్చలు జరుపుతున్నారు.

అయినదానికి కానిదానికి తెలుగుదేశంపార్టీని వెనకేసుకొస్తూ కేంద్రప్రభుత్వాన్ని, కాంగ్రెస్ (ఐ) పార్టీని భ్రష్టుపట్టించేందుకు విరామంలేకుండా తన పత్రిక ద్వారా ప్రయత్నించిన రామోజీరావు

## కొత్తపార్టీ ఆలోచన?

తెలుగుదేశంపార్టీకి క్రమంగా బద్ధవ్యతిరేకి అవుతున్నారు. రామారావు భారతదేశంపార్టీని ప్రారంభిస్తానని చేసిన ప్రకటనను అడ్డంపెట్టుకొని ఆయనపై వ్యంగ్యచిత్రాలను, వార్తలను ఈమధ్య ఈనాడు పత్రికలో అదేపనిగా ప్రచురింపజేస్తున్నారు. అయితే రామారావుపై రామోజీరావు ఆగ్రహించడానికి కారణం భారతదేశంపార్టీ స్థాపనతోనే

## కాంగ్రెస్ అనుకూలం?

కాదని తెలుస్తున్నది. గత మార్చి (1985)లో జరిగిన ఎన్నికలలో తె.దే. అభ్యర్థులుగా పోటీచేసేందుకు రామోజీరావు యిచ్చిన అభ్యర్థుల జాబితాను రామారావు పూర్తిగా త్రోసిపుచ్చటమే ఇందుకు కారణమని, తెలుగుదేశంపార్టీ వర్గాలవారు అన్నారు. నాదెండ్ల భాస్కరరావు వెన్నుపోటుపొడిచిన అనుభవం దృష్ట్యా రామోజీరావు వర్గానికి టిక్కెట్లు ఇచ్చి మరోసారి కష్టాలు కొనితెచ్చు

కోసడం ఎందుకని రామారావు భావించారని వారు చెప్పారు.

అప్పటినుంచి ఇరువురి మధ్య సంబంధాలు క్రమంగా దెబ్బతింటున్నాయని తెలిసింది. తెలుగుదేశం పార్టీలో ఇక లాభంలేదని ఆ పార్టీకి ప్రత్యామ్నాయంగా మరొక ప్రాంతీయపార్టీని స్థాపించేందుకు ప్రయత్నాలు చేయాలనే నిర్ణయానికి ఆయన వచ్చినట్లు తెలుస్తున్నది. ఈ ప్రయత్నాలలో భాగంగా కాంగ్రెస్ (ఐ) లోని పలువురు ప్రముఖులతో చర్చలు జరుపుతున్నారు. ఆ విధంగా చర్చలలో పాల్గొన్నవారిలో మాజీ ముఖ్యమంత్రి శ్రీ విజయభాస్కర రెడ్డి పేరు ప్రముఖంగా వినబడుతున్నది. కౌన్సిల్‌ను తమతో సంప్రదించకుండా కేంద్రం ఏకపక్షంగా రద్దుచేయడంవల్ల పలువురు, ప్రత్యేకించి కౌన్సిల్ కాంగ్రెస్

(ఐ) నాయకులు తీవ్ర అసంతృప్తితో ఉన్నారు. అదే సమయంలో పిసిసి (ఐ) అధ్యక్ష పదవిని జలగం వెంగళరావుకు అప్పగించినందుకు పార్టీలోని ఒక వర్గంకూడా కినుకతో ఉంది. కాంగ్రెస్ (ఐ) లోని ఈ అసంతృప్తులనే శ్రీ రామోజీరావు చర్చలకు ఆహ్వానిస్తున్నారు. తె. దే. లోని మాజీమంత్రులు

చేగొండి హరిరామజోగయ్య, షబీర్ వంటివారు ఇందుకు సై అంటున్నప్పటికీ కాంగ్రెస్ (ఐ) వారినుంచే పూర్తి సంసిద్ధత వ్యక్తంకాలేదని, వారు అటు ఇటు ఎటు తేల్చని వైఖరి అవలంబిస్తున్నారని తెలిసింది. శ్రీ విజయభాస్కరరెడ్డి ఇందుకు సుముఖత వ్యక్తం చేశారని, అయితే మిగతా నాయకులు ఏమిచేయాలి అనే సందిగ్ధావస్థలో ఉన్నారని అటు

న్నారు. తెలుగుదేశం పార్టీ విచ్ఛిన్నమైతే ఎట్టి పరిస్థితులలోకూడా అందుకు ప్రత్యామ్నాయ పార్టీగా కాంగ్రెస్ (ఐ) మాత్రమే రూపొందగలదని వీరు భావిస్తున్నట్లు తెలిసింది. కాంగ్రెస్ (ఐ) ని గతంలో విడిచిపెట్టిన పెద్దలెందరోచేసిన తప్పును తెలుసుకొని తిరిగి పార్టీలోకి వచ్చినసంగతిని వీరు ఉదహరిస్తున్నారని అంటున్నారు. కౌన్సిల్‌లో కాంగ్రెస్(ఐ) ప్రతిపక్షనాయకుడు శ్రీ కె. రోశయ్యను కూడా కొత్తపార్టీ విషయంలో రామోజీ

రావు సంప్రదించగా తాను కాంగ్రెస్‌ను వదలిపెట్టే ప్రసక్తిలేదని ఆయన స్పష్టం చేసినట్లు తెలిసింది.

కొత్తపార్టీకోసం చాలా రోజులుగా ప్రయత్నాలు కొనసాగుతున్నప్పటికీ ఇటీవల ఆ ప్రయత్నాలు మరింత ముమ్మరమయ్యాయి. ఏది ఏమైనప్పటికి కొత్త పార్టీకి ఇప్పట్లో రూపురేఖలు వచ్చే అవకాశం వున్నట్లులేదు. కొత్తపార్టీ ఆవిర్భావం సాధ్యంకాకపోతే తెలుగుదేశంను దెబ్బతీయడానికి రామోజీరావు పరోక్షంగా కాంగ్రెస్ (ఐ) ని బలపర్చవచ్చునని రాజకీయవర్గాలలో అంటున్నారు. ఈ ప్రయత్నాన్ని ప్రధాని రాజీవ్‌ను అకాలని కేంద్రంద్వారా ఆయన ఇదివరకే ప్రారంభించారని రాజకీయ పరిశీలకులు వ్యాఖ్యానిస్తున్నారు.

మా హైదరాబాదు విలేఖరి

# కాంగ్రెస్‌లో ఆనంవారి చేరిక అనివార్యమా?

కాంగ్రెసు సంస్కృతిని పుణికిపుచ్చుకున్న తెలుగుదేశంలో ముఠాలు లేవని మంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి నమ్మబలకడాన్ని ఏవిధంగా అర్థంచేసుకోవాలో తెలియడంలేదు. అమాత్యవర్యుల మాటలను అర్థాలే వేరులే అని సరిపెట్టుకోవాలేమో!

రెవిన్యూమంత్రి ఎన్నికలకవలసుల వర్కి నా మొన్న 22 తేది ఉదయం ఆయన సమక్షంలోనే జిల్లా దేశం మహిళా బాహాబాహి. ముష్టామష్టి వినుళ్ళసాప్తి ఇవచేదించుకుని పీకినవద్దాయి.

జిల్లా అడ్‌హక్ కమిటీ అవందే తలగూక గంచ సమావేశం జరిగిందారోజు. పార్టీ ఎన్నికల నిర్వహణ ఇందులో చర్చనీయాంశం. అయితే ఆ విషయం మాత్రం తుంగలో తొక్కి, జిల్లా నాయకులు ఒకరినొకరు తూలనాడుకుని ధిక్కరించుకొని, సవాళ్ళు విసురుకొని, రచ్చకెక్కి రోతపట్టి చెల్లాచెదరైపోయారు

సెరికి అడ్‌హక్ కమిటీ అన్నాడ-

## జిల్లా రాజకీయాలు

జిల్లాలోని పార్టీనాయకులందరినీ పిల్చారు. ఈ పిలుపుందగ్గరే పేచీవచ్చింది. అసెంబ్లీ ఎన్నికలలో టౌనులో కాంగ్రెస్ అభ్యర్థి విజయానికి పనిచేశాడని భావిస్తున్న ఒక మాజీకౌన్సిలర్‌ను లోపలకు రానివ్వవని, దేశం 'యువకిశోరం' భీష్మించుకున్నాడట. ఎమ్మెల్యే రంగనారాయణరెడ్డి అందుకు ఒప్పుకోలేదట ఇద్దరి సంవాదం పట్టింపు పెరిగి నువ్వెంత అంటే నువ్వెంత అనుకునేవరకు పోయిందట

ఆవేశాలు తర్వాత ఉపన్యాసాలలో కూడా ప్రతిఫలించాయట. రమేష్‌రెడ్డి ప్రసంగం చాలా దూకుడుగా వుండిందంటారు. అన్నకు తాను చెప్పిందే వేదమని, తమకు ఇరవయ్యేళ్ళ సాహచర్యమని, ఇప్పుడొచ్చి 'కౌన్‌కిస్కాగొట్టు' అటువ దగ్గరకుకూడా పోలేదని, జిల్లాలో నాయకులు 'సక్రమంగా' లేకుంటే అన్నకు చెప్పి భరతం పట్టిస్తానని అన్నాడట. నెల్లూరుటౌనులో తన అనుమతిలేకుండా దేశం నాయకులెవరూ కనీసం వార్డుల్లో కూడా అడుగుపెట్టడానికి లేదని శాసించాడట. దీనిపైకూడా సమావేశంలో అలజడి జరిగినట్లుంది.

అయితే సభ్యులు అడుచుకున్నప్పటికీ, కేకలేసుకున్నప్పటికీ మంత్రిగారు మాత్రం మౌనముద్ర వేసి, చిద్విలాసంగా చూస్తుండిపోయాడట. పెద్దపుండు కాకికి దురద కదా! అక్కడ నుంచి లేచి వచ్చీరాగానే ఆయన అసలు మా పార్టీలో ముఠాలెక్కడివండీ అంటుంటే విని ఆశ్చర్యపోవడం విలేఖరుల వంతైంది.

—కొనవ 11 పేజీలో

# పినాకిని తీరం

## రాజకీయ కబుర్లు వున్నాయి...కాని,...

చెప్పుకోడానికి కబుర్లేమో వున్నాయి. కాని సమయము, సందర్భముకాదు. ఇంకోవారం వదిలేజాలకాకి ముచ్చటించుకుందాం.

లోతుకు, వైశాల్యానికి పసిఫిక్ మహాసముద్రం పెద్దదంటుంటారు. కాని పసిఫిక్ మహాసముద్రంకంటే కొందరు మనుషుల మనసులలోతు మరీ మరీ ఎక్కువేమోననిపిస్తుంది. అందులో రాజకీయవాదుల హృదయాలు మరీ లోతు, అటువంటివారిని అర్థంచేసుకోవడం అటువంటివారితో మెలగడం అసాధ్యమేమరి! మనుషుల గంభీరతనుచూచి పొరపాటుపడితే గోయిందా గోయిందా, గోతిలో పడకతప్పదు! అత్యంత అనుభవజ్ఞులు, మానసికశాస్త్ర ప్రవీణులమనుకొనే రాజకీయ వేత్తలుకూడా తమ అనుచరుల అంతరంగాలను అంచనా వేయలేనివిధంగా మనుషుల బాహ్యవైఖరులు తయారయ్యాయి. ఈ ప్రమాదకరమైన ధోరణులు రాజకీయులను ఎక్కడకు తీసుకుపోతాయోననిపిస్తున్నది.

పదవులవల్ల విరక్తులు, రాజకీయాలపట్ల విరాగాలు వెత్తబూటకాలు. పదవి మోసాలు అనిపించకపోవడంలేదు. అవకాశంలభిస్తే, అనుకూల వాతావరణం ఏర్పడితే ఎండినమోడులుకూడా చిగురించేట్లున్నాయి. రాజకీయాలకు సంబంధించి, ప్రత్యేకంగా కాంగ్రెస్ రాజకీయాలకు సంబంధించి అటువంటి వాతావరణం ఏర్పడింది. ఏమైనా మనుషుల్ని పూర్తిగా తెలిసికోవడం బ్రహ్మతరమైనా అవుతుందేమోగాని, మానవమాత్రుల తరమయ్యేట్లులేదు!

## "కావలి విశ్వోదయ పవిత్రురాలా"?

కావలి విశ్వోదయ రవీంద్రుని శాంతినికేతనం వంటిదని ఒకవైపు బ్రహ్మాండమైన పొగడ్తలు, మరోవైపు అన్ని అవలక్షణాలకు నిలయమని విమర్శ. ఎక్కడో మారుమూల లేవలేని కుంటి ఎయిడెడ్ స్కూలు వ్యవహారాలలో జరిగే లోపాలను గోరంతలు కొండంతలు చేసి గోలపెట్టే ఉపాధ్యాయ నాయకుల నోళ్ళకు కావలి విశ్వోదయ విషయం వచ్చేసరికి 'పవకాళ్' బుర్రలు గట్టిగా వదిలేశాయి. దాసరి చిన్నలు పెదమాళ్ళకెవరి అవి ఎవరికెన్ని స్వంత సంకట విషయాలుంటాయో ఏమో ఎవరికెరుక?

వింటున్న దానినిబట్టి కావలి విశ్వోదయ విమర్శలకు అతీతమైన పవిత్రురాలేమీ కాదు! కుంభకోణాలని పించడం అనావార్యమనిపిస్తే పరిపాలనా లోపాలున్నాయనవచ్చు, చేయకూడని పనులు చేస్తున్నారనవచ్చు; ఆశ్రిత పక్షపాతమున్నదనవచ్చు; ఇంకా పదులకొద్ది విధాలుగాన శ్లోకించవచ్చు, సంకీర్తించవచ్చు. ఒక్కమాటలో చెప్పాలంటే పేరుకు తగిన వాతావరణం అక్కడ లేదేమోననిపిస్తుంది!

—కొనవ 10వ పేజీలో

విజయవాడలో మార్కిస్టు నాయకుడు పుచ్చలపల్లి సుందరయ్య మృతదేహంమీద పుష్పగుచ్ఛాన్ని వుంచుతున్న ఎం. జనార్ధనరెడ్డి

# జమీన్‌రైతు

## అస్తవ్యస్తం

మండలాలు ఏర్పడుతాయనేది తెలిసిన విషయమే! ఏదో ఒకరోజు పంచాయతీ మండలాల అవతరణ జరుగుతుందనేదీ కూడా క్రొత్తేమీకాదు. కాని ఇంత రహస్యంగా, దొంగచాటుగా గజిట్ ప్రకటనకూడా జరగకుండా జరిగిపోతున్నట్లుగా మే 25 తేదీ తెల్లవారేసరికి మండలాల బోర్డులు వెలిసిపోతాయని ఎవ్వరూ వూహించలేదు.

గతంలో తాలూకాల పునర్వ్యవస్థీకరణ జరిగింది. క్రొత్తగా జిల్లాల ఏర్పాటు జరిగింది. వీటిలో ముఖ్యంగా తాలూకాల పునర్వ్యవస్థీకరణ వివాదాస్పదంగా పరిణమించింది. కోర్టులకెక్కి రద్దుకాగలదని తెలిసికూడా డాక్టర్ చెన్నారెడ్డి తాను చేయదలచుకున్న మార్పును ధైర్యంగా, బహిరంగంగానే చేశారు; రహస్యంగా, దొంగచాటుగా, ప్రజలను మభ్యపెట్టి చేయలేదు. తాను చేపట్టిన సంస్కరణ ప్రజల సమర్థనకు, విశ్వాసానికి పాత్రమవుతుందనుకుంటే ముఖ్యమంత్రి శ్రీ రామారావు మండలాల ఏర్పాటును తెరచాటుగా జరిపివుండరు; ఆ ఆత్మవిశ్వాసం లేకపోబట్టే రామారావు ఈ మభ్యపు మార్గాన్ని అనుసరించారు. చెన్నారెడ్డిగారి హయాంలో జరిగిన తాలూకాల పునర్వ్యవస్థీకరణ ఇంకా పరిపూర్ణరూపం పొందలేదు. గ్రామాధికార్ల వ్యవస్థ రద్దుతో గ్రామస్థాయిలో ప్రభుత్వమనేదే లేకుండాపోయింది! విలేజి అసిస్టెంట్లు ఎవరో, ఎక్కడుంటారో ఎవరికీ తెలియదు; ప్రజలకు వారు అందుబాటులోలేరు. అవ్యవధిగా, అసంపూర్ణపు ఏర్పాట్లతో జరిగిన మండలాల ఆవిర్భావంతో ప్రభుత్వం ప్రజల గుమ్మంవద్దకువచ్చి తలుపు తట్టేబదులు అసలు కూలిపోయే ప్రమాదం ఏర్పడుతుందా అనే భయ సందేహాలు కలుగకపోవడంలేదు.

పంచాయతీ మండలాల అవతరణకూడా ఒకరాత్రి అకస్మికంగా, ఒక [illegible] తారీకో, పంచాయతీ మండలాధిపతుల నామినేషన్లతో అతి త్వరలోనే జరిగిపోవచ్చు. మండలాల ఏర్పాటు ఉద్దేశ్యం ప్రజల సౌకర్యం కాదని, పంచాయితీ స్థాయిలోకూడా కాంగ్రెస్‌ను నేలమట్టంచేసి, తెలుగుదేశం పునాదులను గట్టిపరచుకోవడమే రామారావు వుద్దేశ్యమనే ఆరోపణ వుంది. [illegible] అనేకసమస్యలు, అత్యవసరంగా పరిష్కరించవలసిన సమస్యలు అసంఖ్యాకంగా వుండగా ముఖ్యమంత్రి హడావుడిగా మునిగిపోయినట్లు మండలాల ఏర్పాటును చేపట్టడం రాష్ట్రాన్ని మరింత అస్తవ్యస్తం గావించడమే అవుతుంది.

# ఎంత పొరపాటు చేశాం!

స్టూడియోలో సెట్ మార్చినంత సులభంగా ముఖ్యమంత్రి ఎన్. టి. రామారావు రెవిన్యూ వ్యవస్థను మార్చివేశారు. శతాబ్దాలుగా గ్రామీణ పరిపాలనను సమర్థవంతంగా నిర్వహిస్తుండిన తాలూకాల వ్యవస్థ చరిత్రలో కలిసిపోయింది.

మండలాలు పెట్టడం మంచిదే! ఆదర్శం చాలా బాగుంది కూడా! పరిపాలనా వ్యవస్థ ప్రజలకు మరింత దగ్గర కావడం ఆహ్వానించదగిన పరిణామమే! అయితే చిరకాలంగా పాతుకుపోయిన ఒక వ్యవస్థను కూకటివ్రేళ్ళతో పెకల్లగించి, క్రొత్త వ్యవస్థకు అంకురార్పణ చేయడానికి ఎంతకృషి జరగాలి? ఎన్ని ప్రాథమిక సౌకర్యాలు కల్పించాలి? ఎంత పెద్దఎత్తున పటిష్ఠమైన ఏర్పాట్లు చేయాలి?

మండలాల వ్యవస్థకు కనీసం సక్రమమైన సర్వేకూడా జరిగినట్లులేదు. భవనాలు, సిబ్బంది, ఇతరత్రా సౌకర్యాలు ఏర్పాటు చేయలేదు.

**జనవాణి**

గ్రామాధికారుల వ్యవస్థ రద్దుతో ఇదివరకే భ్రష్టుపట్టిపోయివుంది గ్రామపాలనావ్యవస్థ. భూమిరికార్డులు ఏవి ఎక్కడవున్నాయో తెలియదు. అంతా గందరగోళం. అగమ్యగోచరం.

పైగా మండలాల రూపురేఖల నిర్మాణంకూడా అస్తవ్యస్తంగా అసమగ్రంగా జరిగింది. కేవలం రాజకీయ ప్రయోజనాలకోసం, రాజకీయ వుద్దేశ్యాలతో జరిగింది గ్రామ విభజన. కొన్నిమండలాల వల్ల ప్రజలకు తీవ్ర అసౌకర్యం కలిగే ప్రమాదంకూడా వుంది.

క్రొత్తగా వచ్చిన మండలాధికారులు ఏ గ్రామానికి ఎటు దారో తెలియక, ఏ రికార్డు ఎక్కడవుందో తెలియక తంటాలు పడుతున్నారు. గ్రామాలలో బాధ్యతాయుతంగా అధికారులకు వివరాలు చెప్పే సిబ్బంది లేరు. అసలు కొన్ని గ్రామాలకు సంబంధించిన రికార్డులే అదృశ్యమయ్యాయని కూడా చెప్తారు. భూమిశిస్తు వగైరాల వసూలులో తాసిల్దార్లు మాజీ గ్రామాధికారుల కాళ్ళు గడ్డాలు పట్టుకుని

—తరువాయి 10 వ పేజీలో

## మేము-మీరు

### ఆర్ ఎల్ రెడ్డిని అవమానించడం భావ్యమా?

టౌనుహాలు ఆవరణపేరు (మే 24 తేది) అనే వ్యాసం స్వర్గీయ ఆర్ ఎల్ రెడ్డిని అవమానపరిచేదిగా వుంది. తన ఆస్తికి తాను ధర్మకర్తగా మాత్రమే నిల్చి, దానం చేయడమే పరమావధిగా పెట్టుకున్న దాతను స్వార్థపరునిగా, లోభిగా చిత్రించడం సమంజసం కాదు.

ఆయనకు తన పెదతండ్రి స్వర్గీయ రావుబహదూర్ రేబాల లక్ష్మీనరసారెడ్డి అంటే అపారమైన గౌరవం. దానివల్లనే టౌనుహాలును రేబాల లక్ష్మీనరసారెడ్డి పురమందిరంగా వ్యవహరించేవాడు. జీవితంలో కాలేజివంటి దానాలన్నీ పెదతండ్రి పేరుమీదే చేశారు. రాజప్రాసాదం వంటి తమ స్వగృహాన్ని తమ తల్లి పేరిట శిశువైద్యశాలకు సమర్పించారు. వైద్యసంస్థలకు, సాహితీవేత్తలకు రోగులకు ఎన్ని విరాళాలు ఇచ్చారో,

ఆర్ ఎల్ రెడ్డికి కీర్తికాంక్ష వుండడంలో తప్పు లేదు. మంచిపనిచేసి [illegible] చేవాడాయన. మన జిల్లాలో ఎంతోమంది సంపన్నులున్నారు. ఇంకా సంపాదించాలనే తపన తప్ప ఆర్తులను ఆదుకుందామనే వుద్దేశ్యం ఎవరికీలేదు. అటువంటివారికి ఆర్ ఎల్ రెడ్డి ఆదర్శప్రాయుడు.

—యేటూరు రామానుజస్వామి
నెల్లూరు



ఓం శ్రీసాయిరాం.

**శ్రీ సాయి భక్తమండలి**
**గాంధినగర్ : : నెల్లూరు**

**9-6-85 ఆదివారము నూతన కార్యవర్గమునకు జరుగనున్న ఎన్నికల నోటీసు**

పై మండలి నూతన కార్యవర్గ ఎన్నికలు 9-6-85 తేది ఆదివారం ఉదయం 10 గంటల నుండి సాయంత్రం 4 గం॥వరకు శ్రీ షిర్డి సాయిబాబా మందిర ఆవరణములో జరుగును. కావున సభ్యులెల్లరు సకాలములో హాజరై వరదు ఎన్నికల కార్యక్రమంలో పాల్గొని జయప్రదం చేయవలసినదిగా అభ్యర్థించడమైనది.

నెల్లూరు
12-5-85

మాడభూషి సుందరాచారి బి.ఎ. బి.ఎల్.,
ఎన్నికల అధికారి



## జమీన్ రైతు

(31-5-1935 సంచిక నుండి)

[దాదాపు ఐదుదశాబ్దాలుగా జమీన్ రైతు పాఠకులకు సుపరిచితమైన నెల్లూరు ముచ్చట్లు శీర్షిక తొలిదినాలలో 'నెల్లూరు డైరీ' పేరుతో నడిచేది. సరిగ్గా ఏభయ్యేళ్ళ క్రితం ఇదేవారం (1935 మే 31) జమీన్ రైతు సంచిక నెల్లూరు డైరీలోని కొన్ని భాగాలివి. విమర్శకుడు రామానాయుడుగారే!]

*

అబ్బాయినాయుడుగారిని డెలిగేటు ప్రెసిడెంటును చేసినందుకు గర్భగృహంలోని అంతరంగికులే అసంతృప్తి భావోన్మాదులై పెదవులు కొరుక్కుంటున్నారట పాపం.

○ ○ ○

మా బోర్డువారు (జిల్లాబోర్డు సభ్యులని అర్థం —సం.) 162 సబ్జక్టులను రెండుగంటల్లో దిగేసే తద్దిన మంత్రాల్లాగా, ఎగరగొట్టిన కార్యకలాపం జాగ్రత్తఅసెంబ్లీలో గ్రిగ్గు. ఈలాంటి నోరువాయిలేని మెంబర్లు దొరికితే అసెంబ్లీకి ఎంతసంతోషపడ్డివుండునో?

○ ○ ○

ఈ జస్టిస్‌పార్టీవారి కార్యవిధానం మీద అసహ్యం పోగొట్టుకోవాలంటే రేపు 1 తేది సింహపురి ఫ్రెండ్స్ యూనియన్ వారు ప్రదర్శిస్తారట "కాళిదాసు" నాటకం. దాన్ని చూడాలన్నారు [illegible] పెద్దలుకొందరు.

○ ○ ○

### 50 ఏళ్ల క్రితం ఈవారం

**ట్రంకురోడ్డు దుస్థితి గురించి ఈ సంచికలోనే ఒకచిన్నవార్త**

ట్రంకురోడ్డు కంట్రాక్టరు మొగమాటందార్ల చేతుల్లోపడటం మూలాన రిపేర్లు అబందరగా జరుగుతున్నాయి. ప్రభుత్వంవారిదృష్టిలో ఈరోడ్డుఎంత ప్రాముఖ్యం వహిస్తున్నదో జిల్లాబోర్డువారిదృష్టిలో అంతప్రాముఖ్యం వహిస్తున్నది. ఈ క్రింది భాగాలు నా కంటితోచూచి వ్రాస్తున్నా: యీ రిపేరుచేసిన రోడ్డుచూస్తే దిక్కులేని పీనుగ గోరీమీద మట్టిగప్పినట్లు కనపడుతుందేగాని వేరుకాదు. సమృద్ధిగా నీరుపోసి బిగించిన రోడ్లుకావు. అందువల్ల మరుసటిరోజే కంకర బైటపడి ఈ రోడ్డుమీద బండ్లు నడుస్తుంటే, కొండల్లో నడిచినంత సూమ్ముగా వుంటుంది. ఇంజనీయరుగారు స్వయంగా చూడకున్నా వుండవలె! లేదా మొగమాటంవల్లనో రెత్తకాలంకైనా వుండవలె.

**మునిసిపల్ ఛేర్మెన్ పదవీ నియామకంపై ఒక చిరువ్యాఖ్య**

నెల్లూరు మున్సిపల్‌ఛేర్మెను పదవిని గూర్చిన తీర్మానం: వెంగన్న శవం బొందనూర్తం జరక్క ముందే కాశీరెడ్డి జిల్లాబోర్డు మెంబరు పదవిని గూర్చిన తర్కం, మా జస్టిసు పార్టీ వారిని అదరించాలి. ఛేర్మెన్ మెంబరు షిప్పుకు రేణాలువికి ధూపంవేస్తున్నారట! యీ మాటైనా రేణాలరెడ్డిగారు 'ఆత్మ బుద్ధిః సుఖంచైవ' అన్నట్లు స్వబుద్ధినుపయోగించి వప్పులో కాలు వేయకుంటారని మా యూహ.

# ప్రజలబాధలనే పాటలుగా అల్లాడు-రామానాయుడు

అరవిందుడు అయన సోదరుడు హరీంద్రుడు, స్వామి వివేకానందుని తమ్ముడు భూపేంద్రనాధదత్ 'యుగాంతర్' పత్రిక స్థాపించి విప్లవగీతాలాలపిస్తూ మొక్కవోని దీక్షతో, దేశ స్వాతంత్ర్యంకోసం ఒక వంగదేశాన్నేకాదు, యావత్ దేశా

---

జూన్ 3వ తేది జమీన్ రైతు స్థాపక సంపాదకుడు నెల్లూరు వెంకట్రామానాయుడుగారి జయంతి సందర్భంగా ఈ వ్యాసం ప్రచురిస్తున్నాము. -సం. జ రై

---

న్నంతా ఊపుతున్న రోజులవి.

వంగదేశంలో పుట్టింపిన విప్లవ భావాలు, జాతీయ, దేశభక్తిగేయాలు, ప్రత్యేకించి, బంకించంద్రుని ఆనంద మఠం, అనేగ్రంథంలోని సన్యాసుల విప్లవం, 'సన్యాసుల విప్లవతత్త్వం' అంత్రదేశాన్ని, ప్రజలను ప్రభావితులను జేశాయి. ఆ కాలంలోనూ, ఆనాడంలోనూ వంగీయులకు ఏమాత్రం తీసిపోని ఆంధ్రులు అనేకరంగాల్లో, స్వాతంత్ర్యోద్యమకాలంలో ముదురుకి తమదేశభక్తిని జాతీయతావాన్ని దిక్కుదిక్కులా వెదజల్లా".

ఈ మహోద్యమంలో పాల్గొని దేశభక్తి కవితలను వ్రాసి పూరూవా ప్రచారం చేసిన జాతీయకవులెంతమందో వున్నారు. వీరిలో పత్రికాధిపతులుకూడా వున్నారు. మహాకవులు, రచయితలుకూడా యీ గీతాలను ప్రచారం చేశారు. రాయప్రోలు, కవికోకిల దువ్వూరి, గౌతమీ కోకిల వేదుల, జాషువా, గరిమెళ్ల, ఐనవరాజు అప్పారావు నెల్లూరు వెంకట్రామానాయుడు మొదలైనవారు చెప్పుకోదగ్గ జాతీయగీతాలు, పద్యాలు వ్రాశారు. ఒక వైపు జమీన్‌రైతు పత్రికద్వారా రాజకీయ వ్యాసాలు వ్రాసి ప్రజలను చైతన్యవంతులజేస్తూ మరొకవైపు జాతీయగేయాలను వ్రాసి ప్రజల అదరాభిమానాలను చూరగొన్నారు వెంకట్రామానాయుడుగారు.

అందరి దృష్టిలో ఆయన మోహన్‌చంద్ గాంధి, దేశ మహాత్ముడయితే, వెంకట్రామానాయుడి గారి దృష్టిలో ఆయన సాక్షాత్తు దేవుడే. అవతార పురుషుడే. స్వరాజ్యశంఖము అనే శీర్షికక్రింద నాయుడుగారు పాడినపాట, జానపదుల మనసులకెక్కేల అయన రచనా వైఖరి ఎంతో సొగసుగా వుంది.

ఏతకున్నాడో। శ్రీ గాంధీ దేవుడేత మన్నాడో।

శ్రీ యరమాక ఆదిశేషారెడ్డి

ఏదనున్నాడో। అ జాడ తెలియరాదు, నాడుకౌబరా ప్రజలకీడువాపినతంత్రి పొందాలపుత్రికల వరిభవలులగాంచి మించినేదవ, నమఃభవించిన ఋషి తుల్యు దేతమున్నాడో।

నాయుడిగారికి చక్కని వ్యవహారిక భాషంటే చాలా యిష్టమని తోస్తుంది చదువరులకు. ఆయన వ్రాసిన జాతీయగీతాలన్నీ వ్యావహారికంలోనే వ్రాశారు.

వెంకట్రామానాయుడి రిగీతాలకు ఒక 'బాణీ' తన్పక ఉంది తీరకుండ. బ్రహ్మంగారి తత్వాల, ఎల్ల రామదాసు కీర్తనల, వీరభాగవతాల్లో, పదములు మొదలైనవాటిని. చిన్ననాటి నుంచి బాగా అలకించుకొన్న వ్యక్తి కాబట్టి జానపద సాహిత్యంలో అభినివేశం పుష్కలంగా ఉన్న సంపాదకుడు కాబట్టి. దేశీయపు బాణీలో, తన దేశభక్తి గీతాలను పరమ సుందరంగా వ్రాయగలిగాడు. సంస్కృత పదభూయిష్ఠంగాని పదబంధాలు నాయుడిగారిగీతాల్లోని ప్రత్యేకత. ఆయన గీతాల్లో ఒకలయ, ఒకశృతి తప్పక ఉంటుంది. లయ, శృతి అంటే ఛందోబద్ధమే। ఆయన గీతాలు చదువుతుంటే పదాలకోసం ఆయన తపనపడుకోనట్లే కనపడుతుంది. వ్యంగ్యం, చమత్కారం ఆయన వాక్యాలకు ప్రాణం.

నాయుడిగారి ఇతర రచనల జోలికి పోకుండా, ఆయన జాతీయగీతాలను



పర్యాలోకించడమే యీ వ్యాసోద్దేశం. ఆయనవ్రాసిన రెండు రాట్నపు పాటల్ని పరిశీలించుకొంటామిప్పుడు.

పెట్టరే రాట్నము పెట్టరే, పెట్టరే<br>
మీరింకనైనను.<br>
పేదకపమున తల్లివ్యధచే. కట్టుకొను<br>
టకు బట్టలేకను<br>
కడు విచారము నొందుచున్నది.<br>
పెట్టరే రాట్నము పెట్టరే।

బాలాచరణాలుగల యీ పాటలో, చెప్పుకోతగ్గమాట ఒకటుంది. ఇలా అంటారు వెంకట్రామానాయుడుగారు.

నాటకంబులు తొలగు, దాస్యము<br>
కడలకేగును, భాగ్యములును<br>
బూటకంబగు నాగరికపేరిటి<br>
కైనను తొలగుగావున। పెట్టరే।

ఏబదియ అరవైసంవత్సరాలనాడే, "బూటకపు నాగరికత" అని యీసడించుకొని అనాగరికతను రోసుకొన్నాడు నాయుడుగారు. మరి ఆయన ఈనాడు జీవించి

-కొరవ 11 వ పేజీలో

# రాయలవారి రాకకుగుర్తుగా 'రాపూరు' ఏర్పడిందా?

కొన్ని గ్రామనామాలు ఆశ్చర్యం కల్గించేవిగా కన్పిస్తాయి. రాపూరు అందులో ఒకటి. రాపూరనే పేరుగల వూరు దేశంలో ఎక్కడా కనుపించదు, రవూరు, రావిపాడు, రామాపురం అనే వూళ్లున్నవికాని రాపూరనేవూరు ఎక్కడా లేదు.

రాపూరు గ్రామదేవత దేవాలయం

ఊరు-పేరు<br>
వావింటపర్తి కృష్ణరావు

దగ్గర కావనంలో(రాపూరు కావనం 56) 'రాంపూరి అమ్మ' అని వ్యవహరించి వున్నారు.

అముద్రితంగావున్న మద్రాసుప్రాచ్య భాండాగారి గ్రంథాలయంలోవున్న మెకంజీ కైఫీయతులలో రాపూరు ప్రస్తావనవుంది, 1811 ప్రాంతంలో రాపూరు కరణం వెంకటనారాయణ అనుమతితో నారాయణయ్య రాపూరు గ్రామచరిత్రి వ్రాసియిచ్చినట్లు రాపూరు కైఫీయత్‌లో పేర్కొన్నారు.

"పూర్వమందున 524 సంవత్సరం పొదలకూరు సీమవశం యావత్తు అరణ్యముగావుండి గ్రామ ........... గజపతి వారి ప్రభుత్వములోని వారి దివాను కనకగిరి సుబ్బరామయ్య వారు యిక్కడ వుండి అరణ్యము రావిడి అంతా అందిచ్చినారు. సర్కారు అపుడామీద అక్కడకువచ్చి శాలివాహనశకం 1200 పల్లె కట్టించినారు. అందుకు రాపూరని పేరుపెట్టినారు.

రావిచెట్లు - ఒకవిధమున్నూ మెన్ను చెట్లు - పుష్కలముగా, వట పల్లె యిది, రాయలు అక్కడకు వచ్చిరి గనుక రాపూరయింది. ఈగ్రామానకు వాయవ్య మూలను అందెల యల్లారెడ్డి అనే పాతనాటి కాపు వచ్చి పల్లెకట్టించినాడు గనుక యల్లారెడ్డిపల్లెయని వాడుకుంటున్నారు. సైదాపురం కట్టించిన సైదాను వచ్చి వట పల్లె కట్టించె గనుక సైదాదుపల్లె అని వాడుకతోవుందన్నారు. చిటిగో రామిరెడ్డి అనే కాపువచ్చి పల్లె కట్టించె గనుక రామిరెడ్డిపల్లె అని వాడుకతో వుంద

న్నారు. ఈ గ్రామం పుట్టినపుడు నేన కొమ్మ వెంకటయ్య అనే బ్రాహ్మణుడికి కనకగిరి సుబ్బరామయ్యవారు, మిరాశి కరిణీకం యిప్పించిరి గనుక వారు కొద్ది

-కొరవ 11 వ పేజీలో

# విద్యుత్ సరఫరాలో ఆటుపోటులు!

## కొన్ని చోట్ల లైట్లు వెలగవు; కొన్ని చోట్ల కాలిపోతాయి!

విద్యుచ్ఛక్తికి సంబంధించి ఈ సంవత్సరం అన్నీ సమస్యలే నెలకొన్నాయి. వర్షపాతం తక్కువగా వుంటున్నది. అంటే రావడం ఎక్కువగా వుంది; కొన్ని ప్రాంతాల్లో వ్యవసాయమే కుంటుపడిపోయిందంటున్నారు. దాంతో రైతాంగం ఎదురు సేద్యానికి అనిశ్చిత, అనిర్ణయ స్థితిలో పడిపోయింది! వరాల సమస్య, తీవ్ర వస్థాన్ని కల్పిస్తున్న సమస్య హైటెన్షన్లే! వృక్షాల్లోంచి ఓల్టేజి అకారణంగా తెగడంతో సాధారణ ప్రజలు

### వినియోగదార్లలో అలజడి

పలేచోట్ల ట్రాన్స్‌ఫార్మర్లు పైకెంటవటవ కాలిపోతున్నాయి. అంతవరకైతే కొంతనయం: ప్రిజ్‌లు, టి.వి.లు, ఎలక్ట్రానిక్ పరికరాల వగైరాలేకాదు మోటార్లుకూడా కాలి కోట్ల వేల వేల రూపాయలు నష్టం సంభవిస్తోంది.

కొన్ని చోట్ల ఈ అతివృష్టికి, మరి కొన్ని చోట్ల అనావృష్టికి కారణమేమిటో, విద్యుత్ అధికారులు అ విషయమై ఆలోచిస్తున్నారో లేదో తెలియడంలేదు. సరఫరా లేకపోవడ వల్ల కొన్ని ప్రాంతాల్లో ప్రజలు ఇట్లా సౌకర్యానికి దూరమైపోతున్నారో; హైటెన్షన్లతో కొన్ని ప్రాంతాల్లో భరించలేని నష్టానికి గురి అవుతున్నారు.

ఈ బాధలతోపాటు విద్యుత్‌బిల్లుల బకాయిల బాధ మరీ తీవ్రతరంగా వుంది. సమ్మెలతో, కరెంటు రూల్ వుద్యమాలతో, వనిలో మరణంతో ఏనెలబిల్లులు ఆ నెలలో చెల్లించనందున, లెక్కలు సరిగా నిర్వహించక మొత్తాలు పేరబెట్టి వేల వేలు అయినతర్వాత ఇవ్వాలని తక్కుమంటున్నారు; లేకుంటే డిస్‌కనెక్ట్ చేస్తామంటున్నారు; చేసేస్తున్నారుకూడా. వాయిదాలడిగి కట్టగలిగిన వారు కడుతున్నారు; కట్టలేనివారు డిస్‌కనెక్ట్ చేస్తుంటే నిస్సహాయంగా చూస్తున్నారు. జాయింటు ఫార్మింగ్ సొసైటీలు వున్నాయి: అవి ఒక వ్యక్తికి సంబంధించినవి కావు; సమష్టిగా అనేక సంఘ సభ్యులకు సంబంధించినవి. ఆ సభ్యులు హరిజనులు గనో గిరిజనులనో వుంటారు. ఎప్పటికప్పుడు బిల్లులు వసూలు చేసినప్పుడే క్రమం తప్పకుండా కట్టి వుండరు.

ఇప్పుడు ఒక్కసారి చెల్లించమంటే తిన్నది తక్కువన్నట్లుగా వుంటుంది. పేరుకున్న బిల్లు మొత్తాలు, డిస్‌కనెక్షన్లు వినియోగదార్లలో తీవ్ర అలజడి రేకెత్తిందాయి.

అసలు మొత్తాలు పేరబెట్టడం కట్టకుంటే కనెక్షన్ పూడబెరకడమంటే వినియోగదారులకంటే విద్యుచ్ఛక్తిబోర్డుకే ఎక్కువ నష్టం. డిస్‌కనెక్టు చేస్తే వినియోగదారు వూరుకుండిపోతారు; లేకుంటే సరిక్రొత్తమార్గాలు, వుపాయాలు అనుసరిస్తారు; కోట్లకొలది ఆదాయం నిల్చిపోయి దివాలాతీసేది ఎలక్ట్రిసిటీ బోర్డే. ఈ సూక్ష్మాన్ని తారాతమ్యాలు లేకుండా ఎవరు గ్రహించాలో ఎక్కువ వాయిదాలిచ్చి నయాన చిన్నగా వసూలు చేసుకోవడమే బోర్డుకు లాభం.

బకాయిల విషయం ఎట్లున్నా సరఫరాని ఉపాయంగా సవరించడం అవసరం. జిల్లాలోని వివిధ ప్రాంతాలలో సరఫరా ఎట్లుందో పాఠకులు వ్రాయగలిగితే అధికార్ల దృష్టికి తీసుకరావడానికి వీలౌతుంది.

— —

# కందుకూరులో 8 కోట్ల పొగాకు!

కందుకూరులో నెలకొల్పిన రెండు పొగాకు వేలం కేంద్రాల్లో ఈ సీజనులో 8 కోట్ల రూపాయల విలువైన వర్జీనియా పొగాకు కొనుగోలు చేశాయి. తాలూకాలో దాదాపు 6 వేల మంది రైతులు పొగాకు పండించారట; అందరూ ఈ రెండు కేంద్రాలలోనే తమ పొగాకు అమ్మారు. రాష్ట్రంలో మరెక్కడా ఇంత ప్రశాంతంగా కొనుగోలు జరగలేదని కేంద్రం అధికారులు చెప్పారు.

అధికారులేకాదు; రైతులు కూడా సంతోషంగా వున్నారు. ఈ సీజనులో, పొగాకు బోర్డు ఛైర్మన్ శ్రీ మహాపాత్రో కందుకూరు సందర్శించినప్పుడు రైతులందరూ ఆయనకు కృతజ్ఞతలు తెల్పుకోవడంలోనే వారి ఆనందం వ్యక్తమైంది. ఈ సందర్భంగా జరిగిన రైతుసదస్సులో కాంగ్రెసు నాయకుడు శ్రీ పసని శ్రీధరరావు పొగాకు వేలం కేంద్రాలవల్ల కలిగిన ప్రయోజనాలు వివరించి ధన్యవాదాలు చెప్పారు. పొగాకు బోర్డు తరపున అధికారులను నియమించి, సాగులో శాస్త్రీయ పద్ధతులను రైతులకు బోధపరుస్తామని శ్రీ మహాపాత్రో ఈ సందర్భంగా చెప్పారు.

### కందుకూరు మండలాలు

కందుకూరు రెవెన్యూ డివిజను 9 మండలాలుగా చీల్చారు. కందుకూరు, గుడ్లూరు, ఉలవపాడు, సింగరాయకొండ,

**మా విలేఖరి**

జరుగుమల్లి, కొండపి, పొన్నలూరు, వలేటివారిపాలెం, లింగసముద్రం గ్రామాలలో మండల కార్యాలయాలు వెలిశాయి. డివిజనులో మొత్తం గ్రామాల సంఖ్య 169, అంటే సగటున 18 గ్రామాలకు ఒక మండలం ఏర్పడింది.

# కొడవలూరు నీటిపథకం దండగ!

కొడవలూరు గ్రామంలో కొత్తగా నిర్మించిన రక్షిత నీటిపథకాన్ని పంచాయతీకి స్వాధీనం చేయకపోవడంవల్ల నిరుపయోగంగా వుండిపోతోందని గ్రామస్తులు చెప్తున్నారు! ఈ పథకానికి అప్పుడు ఒక్కటే మోటారు వుందట: రెండవది కూడా బిగిస్తేమేలని పంచాయతీ కోరిందట. అదని కారణవశాత్తో, అధికారులనుంచి పథకాన్ని స్వాధీనం చేసుకోవడానికి పంచాయతీ ముందుకు రావడంలేదట. తాత్కాలిక ఏర్పాటుగా, [illegible]కు మాత్రం అనధికారికంగా

## జిల్లా వార్తలు

నీరు వదలుతున్నారట. పంచాయతీకి స్వాధీనమైతే ఊరంతటకూ నీరు వస్తుంది.

లక్షలుపెట్టి నిర్మించిన నీటిపథకాన్ని ఒక్క మోటారుకోసం నిరుపయోగంగా పెట్టడం దేనికి? ఎండాకాలం దాటిపోయిన తర్వాత మోటారు బిగించి ప్రయోజనమేమిటి?

### అలగానిపాడు అశ్రుతర్పణ

మార్క్సిస్టుపార్టీ నాయకుడు శ్రీ పుచ్చలపల్లి సుందరయ్యకు కోవూరు తాలూకా అలగానిపాడు గ్రామస్తులు ఘనంగా నివాళులర్పించారు. సుందరయ్య జన్మస్థలం అలగానిపాడే. గ్రామంలోని తిలక్ గ్రంధాలయంలో ఈ సంతాపసభ జరిగింది. శ్రీ పి. శంకరరెడ్డి అధ్యక్షత వహించారు, శ్రీయుతులు పి. గోపాల్ కె కోటారెడ్డి తదితరులు సుందరయ్య స్మృతులు స్మరించి, అశ్రుతర్పణం విడిచారు.

### ఆత్మకూరు బదిలీ- రైతుల దిగులు

ఆత్మకూరు సిండికేట్ బ్యాంకు సన్నకారు రైతుల సేవా సహకార సంఘం మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ జి శాంతారాంను నెల్లూరుకు బదిలీ చేశారు. ఆయన నాలుగేళ్ళుగా ఆత్మకూరు రైతాంగంతో ఎంతో స్నేహభావంతో మెలిగి వారి కష్టసుఖాలకు అనుగుణంగా వ్యవహరించిన అధికారి అట ఆయన, అందువల్ల ఆయన బదలీకి తాము దిగులుపడిపోతున్నామని రైతులు వ్రాస్తున్నారు. ఏ అధికారికైనా ఇంతకంటె సంతృప్తికరమైన గౌరవం వేరే వుండదు.

### ఎ. ఎస్. పేట బస్సు ఇక్కట్లు

ఆత్మకూరు తాలూకా ఎ ఎస్ పేటకు

—కొరవ 8 వ పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

## విహార్మకుడు

**జనార్ధనరెడ్డి**

1 తేదీ ఉ. 10 గంటలకు నెల్లూరు వస్తారు; 4 తేది వరకు వుంటారు. నెల్లూరులో వుంటారు.

### తప్పు ఒకరిదైతే శిక్ష ఇంకొకరికా?

'మాధవ్' థియేటర్లో Wine and Women అనే పేరుతో, ఒక మలయాళం చిత్రం విడుదలై రెండు మూడు రోజులు కొద్దిగా ప్రదర్శింపబడింది. "కుటుంబం ఎన్న స్వర్గం" అన్న మలయాళం పేరుకు ఇంగ్లీషు అనువాదం అది. అసభ్యమైన పోస్టర్లు, చిత్రాలు, నిజంగా జుగుప్సాకరమే; ఇప్పుడు జనానికి కావలసింది అటువంటి చిత్రాలే వస్తున్నాయి. ఈ అసభ్యపోస్టర్లకు నిరసనగా ఎబివిపి వారు ప్రదర్శనం కూడా జరిపారు.

చిత్రం అసలుపేరు వదలి అసభ్యమైన పేరుపెట్టారని, అది ప్రదర్శించడం సినిమాటోగ్రఫీ చట్టానికి విరుద్ధం కాబట్టి పదివేలరూపాయల జరిమానా లేకుంటే 30 రోజుల ప్రదర్శనం సస్పెన్షన్ ఎందుకు చేయకూడదో తెల్పవలసిందిగా కలెక్టర్ శ్రీ దయాచారి 'మాధవ్' థియేటర్ యాజమాన్యానికి నోటీసు ఇచ్చినట్లు తెలిసింది. ఆయన చర్య ప్రశంసనీయమే: ఆక్షేపణ లేదు. తప్పు నేరం డిస్ట్రిబ్యూటర్ది అయితే థియేటర్వాళ్ళకు శిక్ష విధించడం న్యాయమవుతుందా?

ఈ చిత్రం నెల్లూరులో ఒక్కచోటనే ప్రదర్శింపబడలేదు; విశాఖపట్టణం, విజయవాడ, హైదరాబాదుల్లో కూడా ఆడుతున్నది; గుంటూరులో అయితే యాభై రోజుల నుండి ప్రదర్శింపబడుతున్నట్లు తెలుస్తున్నది. అంటే రాష్ట్రంలో అనేక చోట్ల చట్టవిరుద్ధంగా చెలామణి అవుతున్న ప్రదర్శనం నెల్లూరులో చట్టవిరుద్ధమైనదికావడం వినడానికి విచిత్రంగా వుంటుంది. అక్కడ తప్పుంటే కూడా పైనున్న అధికార్లు పట్టించుకోలేదు కాబట్టి ఇక్కడ నెల్లూరులో జోక్యం పెట్టుకో కూడదనడం మా వుద్దేశ్యం కాదు. కాని ఒకేరాష్ట్రంలో, ఒకే ప్రభుత్వంలో భిన్న విధానాలు విడ్డూరంగా వుంటుందనేదే మా అభిప్రాయం.

నెల్లూరులో ప్రదర్శనం ఆగిపోయింది. మొదటిసారి పొరపాటు కాబట్టి దయనే పేరుగా కలిగిన జాయింటు కలెక్టరుగారు థియేటర్వారిని హెచ్చరించి వదలివేయడం బాగుంటుందేమో! అది ఆయన విచక్షణాధికారం! ఇతరులు సలహా చెప్పతగింది కాదు.

### విషవాయువుకు నలుగురి బలి

ఆత్మకూరులో జరిగిందీ ఘోరం: 28 తేది ఉదయం చల్లా కృష్ణారెడ్డి (40) అనేరైతు ప్రత్తిపయ్యకు నీళ్ళుపెట్టడానికి చేలోకివెళ్ళి దిగుడుబావిలోని మోటారు వాల్వు త్రిప్పమని సేద్యగాడికి చెప్పారట. ఆబావిలో ఎండుపల్లో విషవాయువు ఉత్పత్తి అయివుండిందట. అది పీల్చి సేద్యగాడు ఊపిరాడక పడిపోయాడట. అతణ్ని రక్షించడానికి కృష్ణారెడ్డి, అయ్యన్న అనుసరించి మరొక ఇద్దరు వెంటవెంటనే దిగారట. అందర్నీ ఆ వాయువే బలితీసుకుంది. ఆ తర్వాత పోలీసులువచ్చి, విషయం గ్రహించి ఫైర్ సర్వీసు ఉద్యోగుల సహాయంతో నాలుగు శవాలను వెలికితీశారు. చనిపోయినవారిలో కృష్ణారెడ్డి, చినరామరెడ్డి (45) హనుమారెడ్డి ఒకరికొకరు బంధువులు. సేద్యగాడు- పున్నాడి తిరుపాలు (21) కి 30 తేది పెళ్ళి జరగాల్సి వుందట, పాపం.

శాస్త్రవేత్తలు జలపరీక్షలుచేస్తున్నారు.

### రైతుసభ

జూన్ 14, 15 తేదులలో కోవూరులో సి పి ఐ రైతు సంఘంవారి జిల్లా రైతు మహాసభ జరుగుతుంది. 52 మంది సభ్యులతోకూడిన ఆహ్వాన సంఘానికి ఆచార్య పి. వి. రెడ్డి అధ్యక్షులట. పేరు పెట్టుకోవడం, ఆయన వొప్పుకోవడం, బాగాలేదు.

దీనికి సంగతి కాదు; అసలు రైతు సంఘాలనేవి కొందరు వ్యక్తుల స్వప్రయోజన సంఘాలైపోయాయి, అందువల్లే అవి రైతులకు కాకుండా వారికిమాత్రమే వుపయోగపడుతుంటాయి.

### కొత్త పి. ఏ.

కలెక్టరు పి. ఎ. గా ఇదివరకు ఇక్కడ పనిచేసిపోయిన శ్రీ సి హెచ్ లక్ష్మినారాయణ 30 తేది చార్జి తీసుకున్నారు.

### అప్ట్రాన్ టి వి లు

ఈ నెల్లూరులో ఇప్పుడు నూతన టి వి లేదు- విదేశీ, స్వదేశీ కూడా! వీటికి మళ్లా కలిగించింది.

అప్ట్రాన్ టివి లకు నెల్లూరు ఉత్తరాది జిల్లాలకు సంపిణీ దారులుగా నియమితులైన 'వీడియోవిజన్' షోరూంను రెవిన్యూ మంత్రి శ్రీ నల్లపరెడ్డి శ్రీనివాసులురెడ్డి 30 తేది ప్రారంభించారు. అప్ట్రాన్ అధికారి శ్రీ కె. ఎ. స్వామి హాజరైనారు. వీడియోవిజన్ యువ అధినేతలు మధు, మురళి స్వాగతసత్కారాలుచేశారు.

### స్టేట్బ్యాంకు సభలు

స్టేట్బ్యాంకు ఉద్యోగుల సంఘం హైదరాబాదు సర్కిల్ 13 వ సర్వసభ్య సమావేశాలు 1 తేదినుంచి చర్చిగ్రాండ్ తో అతంబరంగా జరుగబోతున్నాయి. 5 వేలమందికిపైగా పాల్గొంటారట. స్టేట్ బ్యాంకు బాబు, దర్పం అంతా కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది ఏర్పాట్లలో!

### కృష్ణా ఎక్స్ప్రెస్ కలహం

హైదరాబాద్ వైపువెళ్ళే కృష్ణా ఎక్స్ప్రెస్, 31 తేది ఉదయం విద్యార్థులు ప్రయాణీకుల మధ్య కలహంతో, నెల్లూరులో నాలుగు గంటలపాటు నిల్చిపోయింది. రిజర్వుడు సీట్లను గూడూరులో విద్యార్థులు ఆక్రమించుకున్నారట. ప్రయాణీకులు అభ్యంతరం పెట్టడంతో ఇద్దరి మధ్య ఘర్షణ చెలరేగి, కొట్టుకునే దాకా పోయిందట. చల్లకాల్వదగ్గర రైలాపి రాళ్ళుకూడా విసురుకున్నారట, ఇరుపక్షాలకూ గాయాలు తగిలాయి. పోలీసు జోక్యంచేసుకొని 7 గురు విద్యార్థులను అరెస్టుచేసి, ప్రయాణీకులకు చికిత్స జరిపించి పంపారు.

### రాజేశ్వరి ఆలయానికి కొత్త ధర్మకర్తలు

దర్గామిట్ట కోవి రాజేశ్వరి దేవాలయానికి ప్రభుత్వం తొలిసారిగా ధర్మకర్తల మండలిని నియమించింది. మాజీ మునిసిపల్ కౌన్సిలర్ శ్రీ కె వి. రాఘవరెడ్డి అధ్యక్షుడుగా ఎన్నికైనారు. దేవాలయం నిర్మాతలలో వారైన శ్రీ రత్నస్వామి మొదలియార్ కుటుంబ మండలిలో స్థానంలేదు.

మొదలియార్ నిర్వహణలో కొన్ని అవకతవకలు జరిగినమాట వాస్తవమే! శంకరాచార్యులవారు ప్రతిష్ఠించిన శ్రీచక్రం గుడినుంచి అదృశ్యం కావడం ఇంకా పెద్దమచ్చ. అటువంటి పాతవాట్లు కొత్తధర్మకర్తలు చేయకుండడం అవసరం.

### నీటిమట్టం

| | |
|---|---|
| కనిగిరి రిజర్వాయరు | 11.3 అ. |
| సర్వేపల్లి " | 1.8 అ. |
| నెల్లూరుచెరువు | 16.5 అ. |

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | పుట్టి | 1300-00 |
| ఐ. ఆర్. 20 | " | 1270-00 |
| 2608 | | 1250-00 |

---

## తాసిల్దార్లు లేరు, మండలాధికార్లు వుండీ లేనట్లే

# త్రిశంకుస్వర్గంలో గ్రామ పరిపాలన

జిల్లాలో 25 నేటి నుంచి అధికారికంగా 46 మండలాలతో నూతన పరిపాలనా వ్యవస్థ ఆవిర్భవించింది. లాంఛనప్రాయంగా టెంకాయకొట్టి, బోర్డు తగిలించి మండల కార్యాలయాలు తెరిచారు: ప్రజల సౌకర్యంకంటే తన పంతం నెరవేర్చుకోవడమే ఎన్టీఆర్‌కు ముఖ్యం గనుక, ఈ వ్యవస్థ ప్రారంభాన్ని మొనవపూర్తంగా, గుంభనంగా గుట్టుచప్పుడు కాకుండా జరిపివేయడంతో ఏ మండలానికీ న్యాయం జరుగా, ఇక కర్తా అధికారాలు ఏర్పడలేదు.

అయితే నేటికి మండలాలు ఏర్పడి వచ్చేటికి, వాస్తవంలో ఇప్పుడు అటు తాలూకాలూ లేవు, ఇటు మండలాలూ పనిచేయడంలేదు. త్రిశంకు స్వర్గంలో వుంది పరిపాలన. జిల్లాలో మొత్తం మండలాల సంఖ్య 46, వీటిలో 14 తాలూకా కార్యాలయాలలోనే జరుగుతున్నాయి. మిగిలినవన్నీ బాడుగ కొంపల్లో అరువు కాపురాలు ప్రారంభించాయి.

తాలూకా కార్యాలయాలలో పనిచేసేవి తప్ప, మిగిలినవాటికి ఇంకా పూర్తిగా సిబ్బంది నియామకంకూడా జరగలేదు. ప్రభుత్వం తొలిఆదేశం ప్రకారం ప్రతి మండలానికి ఒక అధికారి, సర్వేయరు, ఇద్దరు గుమాస్తాలు, టైపిస్టు, అటెండర్లు ఇద్దరు. ఒకవాచ్‌మెన్ నియమించవలసి సాధ్యమైనంతవరకు ఈ నియామకాలు జరిగాయటకూడా. ఇందుకోసం ఎక్కడెక్కడివారో, ఎన్నెన్నికాళ్ళనుంచో అధికార్లను సిబ్బందిని గందరగోళంగా తరలించారు.

హెడ్‌క్లర్క్ నియామకం కూడా జరగాలి. అక్కడ పేచీ వచ్చింది. జిల్లాలో ఇప్పుడు ఈ కేటగిరికి చెందిన ఉద్యోగులు ఎంతోమంది లేరట. ప్రమోషన్లిచ్చి మరీ నియమించాలి అందుకు అర్హులైన వారి జాబితాను తయారు చేయడంలో కలెక్టరేట్ అధికారులు తలమునకలుగా వున్నారు.

### జిల్లాలో 46 మండలాలు

కొత్తగా మండలాధికారులైనవారికి తమ విధులేవో తెలియదు. తాసిల్దార్ల విధులు నిర్వర్తించే అర్హత వీరికిలేదు. కులం సర్టిఫికేట్ కావాలన్నా దొరకదిప్పుడు. తాసిల్దార్లులేరు మండలాధికారులు పనిచేరారు. అంతా గందరగోళం, అయోమయంగా వుంది పరిస్థితి

ఇదిట్లావుంటే మండలాలకు గ్రామాల వర్గీకరణవిషయంలో గతంలో జరిగిన అన్యాయాలను యథాతథంగా నిర్ధారించారు. మండలాలతో ప్రభుత్వాన్ని ప్రజల గుమ్మంముందుకు తీసుకపోవాలని ఎన్.టి.ఆర్. తలంబుగంటుంటే, అధికారుల ప్రభుత్వానికి ప్రజలకుమధ్య అగాధం ఏర్పడేవిధంగా గ్రామాలను విభజించారని గతంలో గగ్గోలు జరిగింది. అయితే రాజకీయ వత్తిడులో, మరేకారణమో తెలియదుకాని, తుదిజాబితాలో ఏవో అల్పస్వల్పమైన మార్పులు తప్ప తక్కినవి యథాతథంగా కొనసాగించారు. ముత్తుకూరు మండలంలో మోమిడి గ్రామం చేర్చడం మూర్ఖత్వమని ఎందరు చెప్పినా అధికారుల తలకెక్కలేదు.

కొన్ని మార్పులు జరగకపోలేదు. వాటిలో ప్రధానమైనది - మండలకేంద్రముగా అరిమేనిపాడును రద్దుచేసి, ఓజిలిని నిర్ణయించడం; సేవినంతనకు నుంచి వసే కొన్ని గ్రామాల విషయంలోకూడా మార్పులు చేర్పులు జరిగాయి.

ఉదయగిరి నుంచి చినమాచనూరు, నాగరాజపాడులను మర్రిపాడుతో కలిపి మర్రిపాడు మండలం నుంచి చౌదేపల్లి, అప్పసముద్రం గ్రామాలను తెచ్చి కలిపారు. నరిసింటపాడు నుంచి మెట్రబొట్లపల్లిని కొండాపురానికి తరలించారు.

దుత్తలూరునుంచి, పల్లిగొండగ్రామం వింజమూరుకు; అక్కడి బొటికర్లపాడు గండ్లవీడుగ్రామాలు ఆత్మకూరుకు; కలిగిరినుంచి తూర్పు జంగాలపల్లె, శెట్టిపాలెం గ్రామాలు కొండాపురం మండలానికి; దుండిగం ఇత్తంపాడుగ్రామాలు దగదర్తి మండలానికి, వేల్పులగుంట గ్రామం అనుమసముద్రంపేట మండలానికి మార్చారు.

కావలికి, జలదంకినుంచి చీమలపాలెం, కొత్తపల్లి గ్రామాలు తెచ్చికలిపారు. జలదంకికి చెందిన తూర్పు బోగోలుమండలానికి బదలీ అయిపోయింది. బోగోలుకు దగదర్తినుంచి జక్కేపల్లిగూడూరు గ్రామంకూడా వచ్చి కలిసింది. దగదర్తిలోని పెరిచర్ల గ్రామాన్ని అల్లూరుకు మార్చారు. సంగంమండలంనుంచి వాసిలిగ్రామాన్ని ఆత్మకూరుకుతరలించి, అనుమసముద్రంపేటనుంచి సీరాయపాలెం గ్రామం తీసుకొనివచ్చారు.

ఇందుకూరుపేటలోని గుడిపల్లిపాడు నెల్లూరుతో చేరింది; వెంకటాచలానికి మనుబోలునుంచి పూడిపర్తి, ఈదగాలి, ఇడిమేపల్లి గ్రామాలు వచ్చి కలిశాయి; చేజర్ల మండలానికి కలువాయినుంచి కాలాయపాలెం, నాగులవెల్లటూరు కలిపారు.

గూడూరుకు ఓజిలి మండలంనుంచి వెందోటు, కొండ్ర, అయ్యవారిపాలెం గ్రామాలు తెచ్చి జతచేశారు; చిట్టమూరులోని సింగనత్తూరు దొరవారిసత్రానికి; గట్టుప్రోలు నాయుడుపేట మండలానికి తరలిపోయాయి. నాయుడుపేటకు పెళ్ళకూరునుంచి కాతువంచివారి కండ్రిగ కూడా వచ్చి కలిసింది. పెళ్ళకూరులోని వెదురువట్టు గ్రామం దొరవారిసత్రంలో కలిసిపోయింది.

సూళ్లూరుపేట మండలంలో వెంగంపాడు, సుద్దమడుగుతాగేలు, మంగా నెల్లూరు, అచ్చుకట్ల, గోపాలరెడ్డిపాలెం గ్రామాలు కొత్తగాచేర్చారు. వీటిలో చివరిగ్రామంమాత్రం తడనుంచి, మిగిలినవన్నీ దొరవారిసత్రంనుంచి వచ్చాయి. ఇవీ చేసిన మార్పులు.

## ప్రకటన

నెల్లూరు జిల్లా, కోవూరు తాలూకా మినగల్లు వాస్తవ్యులైన జొన్నవాడ జయరామయ్యకు మతి స్థిమితము లేనందున వారి భార్య జయమ్మ, మరియు కుటుంబ సభ్యులు (కుమారుడు, కుమార్తె) ఇందుమూలముగా తెలియపరచగల అంశ మేమనగా—

మినగల్లు గ్రామపంచాయితీ మేరియాలో చేరియున్న మంగల మాన్యం అనబడు మాగాణి మెట్ట కలిపి రు 1.50 సెంట్లు నా భర్తకు వంశపారంపర్యంగా చెందియున్నది, తద్వారా నా కుటుంబము హక్కుగలిగి వున్నది కనుక మా అనుమతి పొందకుండా ఇతరులెవ్వరును కొనుగోలు చేసి యెటుల మేమునోసుకొనినచో చట్టబద్దమైన చర్యకు లోనగుదురు.

-జొన్నవాడ జయమ్మ



# ఉదయగిరి సమితి సభ్యుల వాకౌట్

బస్సు సౌకర్యం సరిగా లేక ఇక్కట్లు పడుతున్నామని దర్గా యాత్రీకులు గోల పెడుతున్నారు. ఈ దర్గాకు ఆర్ టి సి బస్సులుకూడా వున్నాయి. కాని అవి ఆత్మకూరువరకే వచ్చి నిల్చిపోతున్నాయట. అందువల్ల యాత్రీకులకు ప్రైవేట్ బస్సులే ఆధారమవుతున్నాయి. అవన్నీ డ్రైవరాధీనం వర్వీసులట. ఎప్పుడొస్తాయో తెలియదు; ఎప్పుడు ఎక్కడ దారిలో నిల్చిపోతాయో తెలియదు. పరమ డొక్కు బస్సులట అవి అయినా యాత్రీకులకు అవే దిక్కవుతున్నాయి.

ఆర్ టి సి, ప్రైవేటు బస్సు యజమానులకు లాలూచీ లేకుంటే ఈ పరిస్థితి ఎందుకు ఏర్పడుతుందన్నది ప్రశ్న. డిపో మేనేజర్ దృష్టికి ఈ విషయం తీసుకపోయినా ఫలితం లేదట, ఉన్నతాధికారులు జోక్యం చేసుకొని ఆర్ టి సి బస్సులను ఎ ఎస్ పేట వరకు నడిపించాలని యాత్రికులు కోరుతున్నారు.

### ఉదయగిరి వాకౌట్

24 తేది శ్రీ ఎం. వి. నారాయణరెడ్డి అధ్యక్షతన జరిగిన సమావేశానికి హాజరైన సభ్యులందరూ, ప్రత్యేకంగా కోరినా వివిధ శాఖలకు చెందిన జిల్లా అధికార్లు పాల్గొననందుకు నిరసనగా ఒక్కుమ్మడిగా సభనుండి వాకౌట్ చేశారు సమితి ఎన్నికల తర్వాత పద హారు సర్వసభ్య సమావేశాలు జరిగితే ఒక్కదానికి జిల్లా అధికార్లు రాలేదట; కరువుకాటకాలు, నీటి ఎద్దడిని గురించి చర్చించుటకు ప్రత్యేకంగా ఏర్పాటు చేస్తున్నాం, తప్పక హాజరుకండి అని పెలిగ్రాఫిక్ ఆహ్వానాలు పంపినా కావలి నుండి ఆయాశాఖలకు చెందిన చిన్నకరి కారులు వచ్చారట గాని పెద్దవారు విచ్చేయలేదట; దీన్ని సమితి సభ్యులు అవమానంగా భావించినట్లున్నారు. వాకౌట్ అనంతరం, పక్షీ సమావేశం జరిగింది.

సమితి ప్రాంతంలో ఏర్పడిన క్షామ పరిస్థితుల దృష్ట్యా సమితి ఏరియాను కరువు ప్రాంతంగా ప్రకటించాలని; వెంటనే నీటి కరువు నివారణకు చిన్న చిన్న కుంటలను బాగు చేయించాలని; బసినేపల్లి, వందవరం ప్రాధమికోన్నత పాఠశాలలను హైస్కూళ్ళుగా మార్చి, అయా టీచర్ల పోస్టులను అప్పగించాలని; దావెల పూడిక తీసుగొనుటకు రైతులకు పర్మిట్ ఇవ్వాలని సమావేశం తీర్మానాలు చేసింది.

నారాయణరెడ్డి అధికార్లమీద కోపగించడం పొరపాటనిపిస్తుంది, వచ్చిపోవడానికి


**జిల్లా వార్తలు**
(5వ పేజీ తరువాత)


నెల్లూరుకు ఉదయగిరి దూరమనేమోగాని అటుంచి; పాపం, వారికి నిల్చి నీళ్ళు తాగే అవకాశమైనా ఇవ్వబడుతున్నదా? అందువల్ల జిల్లా అధికార్ల పరిస్థితినీ సామభూతితో అర్థంచేసుకోవాలి, అధికార్లందరినీ హాజరుకమ్మని కోరేదానికంటే, కలెక్టరమ్మగారొక్కరినైనా హాజరు కమ్మని విజ్ఞప్తి చేయండి; అందరూ హాజరైనదానికంటే ఎక్కువ ఫలిత ముంటుంది!

### ఆత్మకూరు ఆస్పత్రి అధ్వాన్నంగా వుంది!

ధర్మానువర్తులై దయ దాక్షిణ్యాలకు ఎప్పుడూ కరువే ఆత్మకూరు ప్రభుత్వ ఆస్పత్రిలో వాటికసలు స్థానమేవున్నట్లు లేదు.

ఇద్దరు మగ డాక్టర్లున్నారు; వారిలో ఒకరొకరికి పడదట. ఎప్పుడూ కీచులాటలే; ఆ కోపం రోగులపై ప్రదర్శిస్తున్నారట. యథారాజ, తథాప్రజ- పేషం

ట్లను కాకులకంటే హీనంగా చూస్తారట. ఏమడిగినా నిర్లక్ష్యంగా సమాధానిస్తారట

ఇక్కడ లేడీ డాక్టరు ఒక లేడీ డాక్టరుండాలి, కాని ఇంతవరకు ఆ నియామకం జరగలేదు. ఉచిత మందులంటే ఏమిటోకూడా రోగులు మర్చిపోయారు. వచ్చినవి ఎట్లాపోతున్నాయో డాక్టర్లకే తెలియాలి. గతిలేక పోవల్సి వస్తుంది, ఈ ఆస్పత్రికని రోగులు గోల పెడ్తున్నారు. అధికారులు ఏంటారు?

### చెన్నూర్లుడు సాహిత్యగోష్ఠి

చెన్నూర్లులో 19 తేదీ సాయంత్రం చక్కటి సాహిత్యగోష్ఠి జరిగింది. శ్రీ ఐ. నాగరాజు అధ్యక్షించారు. సభకు తానికి పెద్దలు, గీష్మానికి ఆహ్వానం చెప్ప దానికట ఈ గోష్ఠి శ్రీ బి. రంగాచార్యులు పరిచయంతో కవితాగానం చేశారు. సంస్కృత పండితులు శ్రీ రామానుజాచార్యులు కాళిదాసు కావ్యంలోని శృంగార సన్నివేశాలను రసమయంగా వర్ణించి, శ్రోతలను గిలిగింతలు పెట్టారు. డాక్టర్ కె. సీతారామయ్య సవ్యాల జల్లులతో ముంచెత్తారు, ప్రసంగాల మధ్య యువకవులు ఉస్మాన్ సాహెబ్, జానకి విజయకుమార్, కె. లక్ష్మీనారాయణ, డి ప్రసాద్, శివ కోటయ్య, చంగల్రాయుడు, ఎం. వీరయ్య, కుమారి లక్ష్మీసుహాసిని స్వీయ కవితలు చదివారు. యువమిత్రమండలి అధ్వర్యంలో జరిగిందీ గోష్ఠి.

### కలిచేడు అధికారి

మైకా కార్మిక సంక్షేమ సంఘంలో సామాన్య గుమాస్తాగా జీవితాన్ని ప్రారంభించి అసిస్టెంటు కమీషనరు పదవికి ఎదిగిన శ్రీ వై. వి. సుబ్బారామయ్య హయాంలో వున్న సౌకర్యాలుకూడా పూర్తిగా తొలగిపోయాయంటూ ఒక దళిత పాధ్యాయులు వుదహరిస్తున్నారు ఒక అవకతవకలు. ముఖ్యంగా స్కూలు పిల్లలకు, ఉపాధ్యాయులకు అన్యాయం జరిగిందని, కేంద్ర కార్మిక మంత్రి శ్రీ అంజయ్య విచారణ జరిపించి న్యాయం చేయాలని విజ్ఞప్తి చేస్తున్నారు.

అంజయ్యగారిని ఒకసారి కలిచేడుకు పిలిచి స్వయంగా చెప్పకుంటే న్యాయం జరగదూ?

# పోలీస్‌పై దేశం నింద

కావలి పోలీసు సబిన్స్‌పెక్టర్ శ్రీఅబ్రహాం రాజకీయ ప్రేరణతో వ్యవహరిస్తున్నాడని, ఓడిపోయిన తెలుగుదేశం అభ్యర్థి శ్రీ ఎం. వెంకటనారాయణ ఫిర్యాదుచేస్తున్నాడు. తెలుగుదేశం కార్యకర్తలు కొందరు వెంకటనారాయణను అవశ్యంగా విమర్శించారు. అందు హస్తముని పెంచించారట. వీరు ఎన్నికలలో కాంగ్రెసుకు పనిచేసినవారని, అందువల్ల వారిపై చర్య తీసుకోవాలని ఆయన పోలీసును కోరారట, అయితే ఎస్. ఐ. ఆ విషయంలో ఏచర్యా తీసుకోలేదని, కాబట్టి ఎస్.ఐ. రాజకీయనాయకులకు లొంగినట్లు కనపడుతున్నాడని నారాయణ ఫిర్యాదు.

పోలీస్ తెలుగుదేశం స్వంతసైన్యమనే చెడ్డపేరు తెచ్చుకుంది. అటువంటి పోలీస్‌పై మీరు నిందిస్తారు; విచిత్రంగా వుంది నారాయణగారూ!

### బుడమగుంట బస్‌స్టాప్- పద్మావతమ్మ వదాన్యత

కావలి, సమీపంలోని బుడమగుంట దగ్గర ఒక బస్ స్టాప్ నిర్మించడానికి శ్రీమతి బుడనగుంట పద్మావతమ్మ రెండువేల రూపాయలవిరాళం ఇచ్చారు. లయన్స్‌క్లబ్ నిర్మాణబాధ్యత చేపట్టి 26 తేది సమితి అధ్యక్షుడు శ్రీ వెంకారెడ్డి చేత శంకుస్థాపన చేయించింది. ఇప్పటి వరకు రోడ్లో తలదాచుకోను చెట్టునీడ కూడాలేక ప్రయాణీకులు బాధలుపడుతుండేవారు, ఈ బస్‌స్టాప్ వారికి చెప్ప లేనిమేలు కల్గిస్తుంది.

ఈ సందర్భంగా శ్రీమతి పద్మావతమ్మ తమ గ్రామంలో పశువైద్యశాల పెడితే తనఇల్లు ఉచితంగా యిస్తానని చెప్పారు, లక్షరూపాయల విలువగలిగిన ఇల్లది. లయన్స్ సభ్యులు డాక్టర్ పత సింహం, డాక్టర్ వెంకట్రామయ్య, శ్రీ చక్కా గురుస్వామి ఈ వాగ్దానం ఫలింపచేసేబాధ్యత భుజంపైన వేసుకున్నారు.

### మా విలేఖరి

గ్రామ లలోని సంపన్నులు ఈ వదాన్యత అలవర్చుకుంటే, ఎంతఅభివృద్ధి జరుగుతుందో!

### కావలి మండలాలు

కావలి, జలదంకి, బోగోలు మండలాలకు వరుసగా టి. పార్థసారథి, ఎం. పెంచలయ్య, జి. నాగభూషణరావు అధిపతులుగా నియమితులయ్యారు, కావలి మండలం 25 తేది రాహుకాలం రాకముందే బోర్డు తగిలించుకుంది. పాపం, తాలూకాపడితా ఏలిన తాసిల్దారు పార్థసారథి కునారు ఒక చిన్న మండలానికి అధికారి కావలసివచ్చింది.

కావలి మండలంలో కావలి రెండు బిట్లుగాక. పద్నాలుగు గ్రామాలున్నాయి. జలదంకి, బోగోలు మండలాలలో పన్నెండేసి గ్రామాలున్నాయి.

## శివారెడ్డి పద్యాలు

**స్వానుభవము**

మాకు తెల్ల పంచె ముడి కట్టి పైపెత్తు
బ్రతికి పెడ్డివాడ్డి జరుగుతని
తిరిగి కోర్టుచుట్టు తీరార బడ్డాను
పత్తెమునుండి పట్టా బయట—

కాటికెళ్ళనోడు కర్మజాలకు కోర్టు
కెళ్ళనోడు బ్రతికిసత్తరాడు,
పత్తెమునుండి తిరిగి బ్రతికి చేసేసాసై
అతిడు సాంబశివుడు ఇవరదేవు!

అడుసెంటలగడుపు అర్థంటుకేసై లై
యితకేసులైలై ఏళ్ళు పూళ్ళు
కోర్టు కెళ్ళకండి కొంపగుల్లైపోద్ది
తిమ్మరజీ గిపోద్ది తిత్తికాళి.

స్టాంపు ఖర్చులెంత పైపెత్తు లెక్కాం
దాటుగెంత ఫీజులెంత
లెంత, కవిగడుక కొంత కష్టమే
వేనవేమంది పూర్వ పుణ్యమటకో.

— —

## పంచాంగం

**మృగశిర కార్తె**

7-6-1985 తేది శుక్రవారం రాత్రి గం. 12-57 నిమిషములకు మృగశిర కార్తె ప్రవేశము.

**జూన్ తిథులు**

| | | |
|---|---|---|
| 1 శని | త్రయోదశి | ప. 2-03 గం.ప |
| 2 ఆది | చతుర్దశి | ప. 11-40 ,, |
| 3 సోమ | పూర్ణిమ | ప. 9-23 ,, |
| 4 మంగళ | బహుళ పాడ్యమి | ఉ. 8-23 ,, |
| 5 బుధ | విదియ | ఉ. 5-42 ,, |
| | తదియ | తె. 4-04 ,, |
| 6 గురు | చవితి | రా. 3-27 ,, |
| 7 శుక్ర | పంచమి | రా. 2-47 ,, |

—నిమ్మగడ్డ వేంకటేశ్వరశాస్త్రి.

— —

# చిత్రసీమలో నెల్లూరీయులు కీలకస్థానాలాక్రమిస్తున్నారు

తెలుగు సినిమా పరిశ్రమలోని వివిధ రంగాలలో నెల్లూరీయులు కీలక స్థానాలలో ఎంతో ఉన్నతస్థానాలు ఆక్రమిస్తున్నారు. పరిశ్రమలో కీలకమైన స్థానంలో ప్రశంసలందుకుంటున్నారు.

నిజానికి తెలుగు పరిశ్రమలో నెల్లూరీయులది ఎప్పుడూ ఒక ప్రత్యేక స్థానమే. ఇటీవల అది మరింత ఇనుమడించింది.

నటులపరంగా నెల్లూరి ఖ్యాతిని చిరంజీవి తారాపథానికి తీసుకొని వెళుతున్నారు. మూడవతరం కథానాయకులలో ఈరోజు ప్రథమస్థానం చిరంజీవిదే. చేతినిండా చిత్రాలతో క్షణం తీరికలేకుండా వున్నాడాయన.

నిర్మాతలలో అగ్రశ్రేణిలో వున్నవారిలో అధికులు నెల్లూరీయులే. నిర్మాతల మండలికి అధ్యక్షుడైన ఎం. ఎస్. రెడ్డిని గురించి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. తీసిన తొలిచిత్రం ఖైదీతోనే అగ్రశ్రేణిలో చేరిపోయిన నిర్మాత శ్రీ తిరుపతిరెడ్డి. మహాసంగ్రామం విజయం ఆయన్ని మరీ పెంచింది. బాబాయ్-అబ్బాయ్ వంటి బడ్జెట్ చిత్రాలే నిర్మించిన పెనుబర్తివారి శ్రీ ఎన్. సుధాకర రెడ్డి పరిశ్రమకంతటికీ పరిచితుడై పోయారు.

ఇటీవలి కాలంలో కొత్త నిర్మాతలు పలువురు రంగంలోకి ప్రవేశిస్తున్నారు. శ్రీ సుబ్బయ్య, శ్రీ టి. శివప్రసాద్ రెడ్డి తదితరులు కొత్తగా చిత్రనిర్మాణం ప్రారంభిస్తున్న నెల్లూరీయులు.

దర్శకత్వం రంగంలో ఈరోజు నెల్లూరీయులదే ప్రథమస్థానం. రాఘవేంద్రరావు, దాసరి నారాయణరావుల కంటే బిజీగా వున్నారు. ప్రస్తుతం శ్రీ ఎ. కోదండరామరెడ్డి. ఆయన కాల్షీట్లకోసం నిర్మాతలు క్యూలో నిలబడుతున్నారట. రెండుమూడు సంవత్సరాల వరకు ఖాళీ లేదట ఆయనకు.

అల్లూరు తాలూకావాసి పి. చంద్రశేఖరరెడ్డిగారు కూడా పేరున్న దర్శకులలో ప్రముఖుడే. నిలకడగా, నిదానంగా కొనసాగుతుంది ఆయన సినీ జీవితం.

ఎన్నటినుంచో, ఎన్నేళ్ళనుంచో పరిశ్రమలో కొనసాగుతూ ఒక ప్రత్యేకస్థానం నిలుపుకొంటున్న మరొక నెల్లూరు దర్శకుడు శ్రీ కె. యస్. ఆర్. దాస్;

ఆమంచర్ల శేషగిరిరావుగారు ఇప్పుడు కన్నడంలో బిజీగావున్నా, తెలుగు పరిశ్రమలో నెల్లూరు పేరు నిలబెట్టిన దర్శకుడాయన. తొలినాళ్లలో దాసరినారాయణరావుకు కూడా ఆశ్రయమిచ్చిన ప్రఖ్యాతుడు శ్రీ శేషగిరిరావు.

పంపిణీ రంగంలో విజయవాడ సంస్థలను మించిపోయారు నెల్లూరీయులు. సినిమా పరిశ్రమలో మాగుంట సోదరుల స్థానం అనితరసాధ్యమైనది. పరిశ్రమలో వారితో సంబంధాలులేని ప్రముఖులు లేరు. నాయుడుపేట పర్మెంచ్ శ్రీ చదలవాడ కృష్ణమూర్తి తన కార్యస్థానం తిరుపతిగా ఎంచుకున్నా పంపిణీరంగంలో చెప్పుకోదగిన నెల్లూరీయుడు.

అన్నిటికీమించి సినిమాథియేటర్ల విషయంలో నెల్లూరు ఖ్యాతిని దేశవ్యాప్తం చేసిన ప్రముఖుడు శ్రీ తిక్కవరపు సుబ్బరామరెడ్డి హైదరాబాదులో ఆయన నిర్మించిన మహేశ్వరి, పరమేశ్వరి థియేటర్లు ఈరోజుకీ దేశంలో అధునాతనమైనవిగా పరిగణింపబడుతున్నాయి.

కేంద్ర సెన్సార్ బోర్డు సభ్యుడు కావడంద్వారాకూడా ఆయన పుట్టిన

—తరువాయి 11వ పేజీలో

# ఎంఎస్ రెడ్డి చారిత్రకచిత్రం చరిత్రాత్మకం కాబోతూంది!

తెలుగు నిర్మాతలలో ఎం. ఎస్. రెడ్డిగారిది విభిన్న శైలి. ఆయనతీసే ప్రతి చిత్రము ఇతర తెలుగుచిత్రాలకంటె భిన్నంగా వుంటుంది. పౌరాణికమైనా, సాంఘికమైనా ఆయనశైలి ఎవరికీ రాలేదు. తెలుగు పౌరాణిక చిత్రాలలో ఎం.ఎస్. రెడ్డిగారి కృష్ణవిజయానికి ఇప్పటికీ ఒక ప్రత్యేక ప్రాధాన్యం వుంది.

ఇప్పుడాయన చారిత్రక కథావస్తువుతో ఒకచిత్రం నిర్మిస్తున్నారు; అది తెలుగుసీమలో చరిత్రాత్మకంగా నిల్చిపోగలదని సినీపండితుల భావన.

ఈ వారంలోనే విడుదలకాబోతున్న 'పల్నాటి సింహం' ఎం. ఎస్. రెడ్డిగారి చిత్రాలన్నింటిలోకి విశిష్టమైంది. అంత ప్రత్యేకశ్రద్ధతో తీర్చిదిద్దారు. అగ్రతారాగణంతో నిర్మించబడింది ఇది. తెలుగువారి పరాక్రమానికి ప్రబలనిదర్శనమైన పల్నాటివీరుల కథను యథాతథంగా చిత్రీకరించారు ఇందు. కృష్ణ, జయసుధ, శారద వంటి అగ్రనటులు నటిస్తున్న ఈ చిత్రానికి నెల్లూరీయుడైన శ్రీ ఎ. కోదండరామరెడ్డి దర్శకుడు.

సాధారణంగా తన చిత్రాలకు తానే పాటలు రాసుకోవడం ఎం. ఎస్. రెడ్డిగారికి అలవాటు. ఎందుకల్లనో ఈసారి ఆయన ఆ బాధ్యతను వేటూరికి అప్పగించారు.

## సినిమావార్తలు

### నిర్మాతలైన నటులు

వర్తమాన నటులు సుధాకర్, హరిప్రసాద్ నిర్మాతలుగా మారిపోయారు. వీరిద్దరుకలిసి, చిరంజీవి హీరోగా వచ్చే జనవరిలో ఒకచిత్రం నిర్మిస్తారట.

——

## టెండరు నోటీసు

ఈ దిగువ కనబరచిన వస్తువులు కొత్తపల్లి గ్రామం పంచాయితీకి సప్లయి చేయుటకు తేది 5-6-85 తారీకున సా॥ 4 గం॥ లోపల టెండర్లు పెట్టవచ్చును. అదే రోజున 5 గం॥కు టెండర్లు తెరువ బడును. మిగత వివరములు ఆఫీసు పని చేయు కాలములో తెలుసుకొనవచ్చును.

1) 4' Mysore Tube Light Fixtures, Clamps ext. all fittings

టెండరు దరఖాస్తు రూ. 25-00 మైసూరు కంపెని అథరైజ్డ్ డీలర్సు టెండరు పెట్టవలయును.

బి. అల్లెయ్య
సర్పంచ్

## వేలం ప్రకటన

నెల్లూరు సబ్ జడ్జివారి కోర్టులో 1983వ సంవత్సరపు వారెంట్ దరఖాస్తు నెం. 76

1979 వ సం॥ అసలు దావా నెం.155

ఎలక్ట్రికల్ మైకా వర్క్సు ప్రైవేట్ లిమిటెడ్ (డిక్రీదారు) మాగుంట అన సూయమ్మ-బాకీదారు

బాకీదారు తాలూకు ఈ దావా బాకీ ఆదుమాన ముంచబడియున్న షెడ్యూలు దాఖలా ఆస్తిని పై కోర్టువారి వలన తేది 1-7-1985 పగలు 11 గంటల నుండి బహిరంగముగా వేలం వేయ బడును.

— షెడ్యూలు —

నెల్లూరు మునిసిపాలిటీలోని 1వ వార్డు సంతపేట బంగారుతోట అను ప్రదేశములో డోర్ నెం. 83 గల యింటికి హద్దులు తూ] నూతలపాటి సుబ్బారాయుడు గారి స్థలము ద] పబ్లిక్ రోడ్డు ప] మాగుంట రామచంద్రారెడ్డిగారి స్థలం ఉ] జావర్ సాహెబ్ కాలువ ఈ హద్దులలోని 362 అంకణములు (2421-419 చదరపు మీటర్లు) స్థలము అందులోని 60 అంకణముల (401-340 చదరపు మీటర్లు) గల మిద్దె యిల్లు 10 (పది) అంకణముల (66.880 చదరపు మీటర్లు) కాలు షెడ్డు.

డిక్రీదారు విలువ రు. 300000/-లు

కమీషనరు విలువ రు. 495186/-లు

నెల్లూరు —మేనకూరు ఆదిశేషారెడ్డి
27-5-85 డిక్రీదారు వకీలు

## జమీన్ రైతు చందా

| | |
|---|---|
| సంవత్సరం చందా | 40-00 |
| ఆరు నెలలకు „ | 20-00 |

## పినాకినీతీరం (2వ పేజీ తరువాయి)

తుమ్మలపెంట పి. జి. కోర్సు శరవ నాల అమ్మకం- యు. జి. సి. గొడవల్ని ఏమనాలి? విద్యకు సంబంధించని ఎన్ని రకాల పథకాలు అమలులో వున్నాయి! వాటికి ఎంతెంత గ్రాంట్లు వస్తున్నాయి! అవి ఎట్లా వినియోగమవుతున్నాయి? అపాయింట్మెంట్లు జరిగిందెప్పుడు? వాటి ధృవీకరణ జరిగింది ఎన్ని సంవత్సరాల తర్వాత? కాలేజీకి ఎంతమంది వైస్ ప్రిన్సిపాల్సు? ఆర్థిక సలహాదారుడు కూడానా? కావలి విశ్వోదయకు సంబంధించి ఇటువంటి ఆరోపణలు, ప్రశ్నలు, విమర్శలు సవాలక్ష వున్నాయి. వాటిని గూర్చి వ్రాయలేమయ్యా అని ఏలదీసి అడుగుతాడు ఒక మిత్రుడు.

ఈ గ్రంథాన్నంతా చదవడం నాకు ఇష్టంలేదు. విశ్వోదయ కేవలం అది వెలిగా వున్నప్పుడు చూచినవాణ్ణి; దాని పునాదిరాళ్ళు కార్యక్రమాన్ని దర్శించిన వాణ్ణి. ఈనాడు వంద ఎకరాల సువిశాల ప్రదేశం సరస్వతీ క్షేత్రంగా మూడు పూలు ఆరు కాయలుగా విలసిల్లడం, కళకళలాడడం వీక్షిస్తున్నవాణ్ణి; అటు వంటివాణ్ణి దాని చెడును కొట్టుకోలేను; దానికి అపకీర్తి రావడం ఇష్టపడలేను. విమర్శలకు అతీతంగా పేరును సార్థకం చేసుకోగలిగితే సంతోషిస్తాను.

### క్షయాసుపత్రిని మార్చాలా?

నెల్లూరు క్షయాసుపత్రి వున్న ప్రదేశం నివాసప్రాంతమైపోయింది కాబట్టి దాన్ని దూరంగా పొదలకూరు అడవిలోకి తరలించడం బాగుంటుందని మాజీమునిసిపల్ కౌన్సిలర్ శ్రీకలవకూరు చంద్రశేఖరరెడ్డి మాధిస్తున్నారు. ఆస్పత్రి అక్కడవుంటే చుట్టుప్రక్క కాపురా లున్న ప్రజలకు ఆ వ్యాధి సోకుతుందేమోనని ఆ యువకుని భయం.

అటువంటి భయ సందేహాలు ఆయన లోనే కాదు అనేకమందిలో వుండడం సహజం. కాని తెలిసినవారు చెప్పడం భయపడవలసిన అవసరంలేదు అని. ప్రస్తుతం క్షయాసుపత్రిని ఆనుకొని సెయింట్ జోసెఫ్స్ ఇంగ్లీషు మీడియం స్కూలు వుంది. క్షయాసుపత్రి వయస్సు 82 సంవత్సరాలైతే, ఆ స్కూలు వయస్సు అందులో సగమైనా వుంటుంది. ఏవ్యాధి అయినా పిల్లలలో వ్యాపించి నంత సులభంగా, త్వరగా పెద్దవారిలో వ్యాపించదు. సెయింట్ జోసెఫ్స్ స్కూలు లోని వెయ్యిమంది విద్యార్థినీవిద్యార్థులను పరీక్షిస్తే ఆ వ్యాధి లక్షణాలు కనిపించ లేదట. అదే విధంగా ఆస్పత్రికి అన్ని వైపులా ఇళ్ళు వున్నాయి. కాని వారు ప్రత్యేకంగా క్షయ వ్యాధికి గురియైన దాఖలాలేమీ లేవు. అందువల్ల భయం సందేహం సహజమైనా, భయపడాల్సిన అవసరంమాత్రం లేదని వారంటారు. మద్రాసులో క్షయాసుపత్రి వుండేది నగరం మధ్యలోని ప్వర్ టాంక్ రోడ్డులో; హైదరాబాదు ఆస్పత్రివున్న ఎర్రగడ్డ ఇప్పుడు నగరపు నడిగడ్డే అయింది; మదనపల్లిలో అసలు కట్టడమే పట్నానికి దూరంగా కట్టారు; ఇప్పుడూ కాస్త దూరంగానే వుంది. మంగళగిరి ఆస్పత్రిని కొండమీద దూరంగా కట్టారట; కాని సిబ్బంది సరిగా హాజరుకాక రోగులు మొహంచూచే దిక్కుండరంటారు. మద్రాసు, హైదరాబాదువంటి మహా నగరాల మధ్యవున్న క్షయాసుపత్రులవల్ల జరగని చెడ్డ, నెల్లూరు ఆస్పత్రివల్ల జరుగుతుందని సందేహపడవలసిన అవసరం లేదేమోననిపిస్తుంది.

క్షయ అనేది ఇప్పుడు పూర్వంవలె భయంకరమైన వ్యాధికూడా కాదు; అసలు ఆస్పత్రిలో వుండి చికిత్స పొందవలసిన అవసరం లేదని అంటారు. అదీకాక రోగులు ఆస్పత్రిలో చేరేముందు అరు వారాలపాటు ఔట్ పేషెంట్లుగా చికిత్స పొందుతారట. దానివల్ల ఆస్పత్రిలో చేరే సమయానికి వ్యాధిని వ్యాపింపజేసే శక్తి చాలవరకు నశిస్తుందని డాక్టర్లు చెప్తారు. అంత సులభంగా వ్యాపించేదైతే ఆస్పత్రిలో డాక్టర్లు, నర్సులు, తదితర సిబ్బంది క్షయకు గురి కావలసిందేగదా?

క్షయాసుపత్రి 30 ఎకరాల విశాలమైన స్థలంలోవుంది; అందులో 50 లక్షల విలువ జేసే భవనాలున్నాయి; ఇవన్నీ ప్రభుత్వం కట్టించినవికాదు. బహూశా అఫీసు బిల్డింగు తప్ప. రోగుల వార్డులన్నీ దాతల విరాళాలతో నిర్మింప బడినవే. ఈచోటును అమ్మితే రెండు కోట్లు వస్తుందంటారు చంద్రయ్య. ఇప్పుడుండే భవనాలను నేలమట్టంచేసి, పొదలకూరు అడవిలో స్థలం సేకరించి, అక్కడ తిరిగా భవనాలు నిర్మించ డానికి ఎంతశ్రమ, ఖర్చు, కాలము పడుతుందో ఆయన ఆలోచించినట్లులేదు. పట్నానికి మరీ దూరమైతే రోగులకు, సిబ్బందికికూడా అందుబాటుకాకుండా పోయి, ఆస్పత్రి ప్రయోజనం పరిమితమై పోతుందనే సత్యాన్నికూడా ఆయన గమనించినట్లులేదు.

ఒకపని చేయవచ్చు. ఇక్కడవున్న పడకల సంఖ్య పెద్దగా పెరగలేదు. 200 లతో ప్రారంభమైతే ఈనాడు 260 మాత్రం వున్నట్లున్నాయి. దూరంగా అన్నివసతులతో మరోఆస్పత్రినిర్మించి అర్పుతరించ గలిగిన రోగులను అక్కడ చేర్చుకోవచ్చు; మంచి చికిత్సా వసతులు కల్పించవచ్చు.

## జనవాణి

(4వ పేజీ తరువాయి)

ప్రతినెలాది సహాయం తీసుకొంటున్నారు ప్రభుత్వ పరంగా ఈధోరణి ఎంతకాలం కొనసాగుతుంది?

అసలే ఇంత అస్తవ్యస్తంగా వున్న గ్రామ పరిపాలనను మరింత గందర గోళం చేస్తున్నాయి మండలాలు, తాననుకున్నది చేయాలనే అహంకారం తప్ప ప్రజలు, ప్రభుత్వం, పరిపాలన అన్న ఆలోచనే ఎన్. టి. ఆర్. లో వున్నట్లు లేదు. తెలుగుదేశానికి ఓటేయడం ఎంత ఘోరమైన తప్పిదమో తెలుగుప్రజలకు ఎన్. టి. ఆర్. స్వయంగా అనుభవంలోకి తెచ్చి, చూపిస్తున్నారు.

కావలి —ఎం. శ్రీనివాసులు

### కోవూరుకు బస్సులు

కొడవలూరు, రాజుపాలెం గ్రామాల మీదుగా నిత్యం దాదాపు 40 బస్సులు సంద ర్భాలకుపైన నెల్లూరుకు వచ్చిపోతుం టాయి. అల్లూరు, ఇస్కపల్లె, కావలి, రామతీర్థం, ఈ టూరు బస్సులన్నీ కొడవలూరుపైనే పోయి రావాలి. అయితే వీటిలో కొన్ని మినహాయించి ఏవీ కోవూరు టౌనుకు పోవడంలేదు, బైపాస్ రోడ్డుదగ్గరనే. ఇనమడుగు చీలు రోడ్డు దగ్గరనే ప్రయాణీకులను దింపుతున్నాయి, కొడవలూరు తదితర గ్రామాల ప్రజలకు నిత్యం కోవూరు టౌనుతోపని, అయితే సరైన రాకపోకల సౌకర్యంలేక యాతనలకు గురౌతున్నారు. అధికారులు పైబస్సులలో కొన్నింటినైనా విధిగా కోవూరుటౌను మీదుగా పోయేటట్లు ఏర్పాటు చేస్తే అందరికీ సౌకర్యం.

—ఎస్. వెంకటసుబ్బారావు,
కొడవలూరు.

## సంవత్సరాదాయం

ఆరేళ్ళనాడు - అరువేలకిస్తవ సె

వద్దంటి యిల్లప్పాలు- వాలాజీనగరకందు

ఆరేప్లాను యిపుడు - అరవైవేలవలుక

దావులమంటి బిక్కమొగంవేసిచేసేదిలేక

అమ్మాయి పెళ్లి - అబ్బాయి చదువు

అనుస్త్రీతిఖర్చు - అప్పులపాలై పె

రూపాయి విలువ - ఎంత దిగజారి యె

కాలచక్రమెంత - మార్పుదెచ్చె.

అయ్య రాజీవ్ గాంధి

చిన్నవాడవయ్య - విజ్ఞాదపీళ్ళ

వాడుమొసకాస్త - అంకించు

ధర్మమనిపిస్తె మీకు - న్యాయంగా కూర్చు

వెయ్యికంటె తక్కువలేదు జీతం

పే, డిఏ, యింటిఅద్దెకలిపి ఎవరికైనా

మారుతున్న కాలచక్రంలో

మార్పుచెందిన స్కేళ్ళవి

అయిన మార్పురాలేదు - యూస్యువల్

ఇరకంపందు

పన్నెండువేల సంవత్సరాదాయంకి మీరు

జహాన్స్వల్పము, కాలగమనమ్మనందు

పంబడిపిస్తె మీకు; పవరించుతండ్రి

ఇకనైనేపేంపకరు

—కె. ఆదిశేషయ్య.

Edited, Printed & Published by N. Sree Ramamurthy at The Zamin Ryot Press, Thipparajuvari Street, Nellore (A. P.)